# సూ [illegible]

ఇది

శృంగారకవి సర్వారాయుఁడుచే,

రచియింపఁబడినది.



మొదటికూర్పు 300.

కాకినాడ.

స్కేప్ అండు కో, ముద్రాక్షరశాలాముద్రితము.

1912



# సూక్తి.



౧. పూవునకుఁగాని తద్వర్ణమునకుఁ గాని
వాసనకుఁగాని హాని యేపాటియేని
లేనిగతిఁ దేనెఁగొని యేగు తేనెటీఁగ
భంగి సజ్జనుఁ డిలలో మెలంగిపోవు.

౨. వేయిమందిని యుద్ధము చేయునట్లు
గెల్చు నాతనికన్నను బోల్చ నొక్క-
తన్నుఁ దానె జయించిన ధన్యుఁడెవ్వ
నాతఁడే బలజయశాలి యనఁగ జగతి.

౩. ద్వేషముచే నెప్పుడైనఁ
ద్వేషమ్ము జయింపఁబడునె? ప్రేమముచే నా
ద్వేషము ద్రోయంబడునని
భాషింతురు పెద్దలిది స్వభావము సుమిత్రా.

౪. మనుజుఁడు దయచేఁ గోపం
బును, సత్యముచే నసత్యమును, దానముచే
తను లోభము, మంచితనం
బునఁ జెడుగుం, ద్రోయవలయు బుద్ధిం దలఁపన్.

౫. గుణకర్మంబులచేతనె
ఘనుఁడగు, నల్పుఁడగుఁ, గాని కానేరఁడు సం
జననంబుచేత; సంతత
గుణకర్మములే ప్రకాశగుణములు సుమిత్రా.

గి సశక్య ; మదే వశపడి
నను సుఖమగుఁ ; గాన లోఁగొనఁగఁ గడఁగవలెన్.

గీ. స్థిరముగా నుండఁజాల దీదేహమెపుడొ
పడు ననుపయోగ మగుదుంగ వలెనె పుడమిఁ
దల్లియుం దండ్రి యన్నయుఁ దమ్ముఁడేమి
చేయఁగలరు ? మనంబెసూ సాయపడును.

గీ. శిశుకు భయంపడుచునుండు జీవితమున
కందఱుం బ్రేమఁజూపుదు రట్లుగాన
నీవు నందఱివంటిఁడ వే యనుకొని
మెననిఁ దూలనాడకు ; నొంప ; కెదియమేలు.

క. సంతోషమునను దుఃఖము,
సంతోషంబునను సుఖము, జనియించును ; ద
త్సంతోషము నెడబాసిన
నెంతయు సుఖదుఃఖము లుదయింపవుగాదే.

గీ. కనఁగ నాలోచనములేని జనునియూశ
పురుగువలెఁ బ్రాకుచుండు నీపుడమిలోనఁ
బండ్లకై కోఁతిదుమికెడు పగిది వాఁడు
వెండియుం జన్మమెత్తుచు నుండుదాన.

క. సత్యము నుడువుము, ధర్మము
నిత్యము నడుపుము, తలఁపుము నిజతత్త్వము, స
త్కృత్యంబే పుణ్యము, దు
ష్కృత్యంబే పాప, మనుచు నెఱుఁగుమి మిగులన్.

క. ధనమె ప్రధానం బంతెకు,
ధనవంతుఁడు తలఁచు నేపిదాఘఁడంబైనన్
దనుదానె వచ్చిచేరు,
"ధనమూలమిదంజగ" ప్రసంగా వినమే ?

గీ. పాలు నీరును గలసిన భాతిజనుల
నైకమత్యంబు గలిగిన నవనిలోన
వారల న్వేఱుసేయ నెవ్వారితరము ?
నిఖిల సుఖములు సమకూరు నిడినిమీఁద.

గీ. ఎన్నిసుగుణములుండిన, నెంతధనము
గలిగియుండిన, యోగ్యత కలుగకున్న
వానిజన్మము వ్యర్థఁ మివ్వసుధలోన.
గాన దానికన్నై పనిఁ బూనవలయు.

గీ. ఎంతపెట్టి పుట్టినంతె కా కెంతెంత
పాటుపడినఁగాని ఫలము గలదె?
యీశ్వరుం డొసంగుతృణము మేరువటున్న
తృప్తికన్న సుఖము పృథివి లేదు.

గీ. పాపములలోనఁ బాపము పలికిబొంకు,
టది యటుండఁగ నొక్కమా టాడితప్పె
నేని మఱివాఁడు సత్యము లెన్నొచెప్ప
నిమ్మ నమ్మదు రే యింక నెవ్వరైన ?

గీ. ధనము నార్జింపవలయును ధర్మవృత్తి,
దాని నభివృద్ధిఁజేయుచు దాఁచవలయు,

దానిలోఁ గొంత త్రాఁడినఁ, దానమొక్క
కొంత బుడఁదగు, లేకున్న సుంతనిలదు.

గీ. పట్టముఁగ నేసినట్టి సద్ధర్మంబులోన
పక్షిబిందు వొకండైనఁ బడనివగిది
మనసు దిట్టతనముఁగన్న మనుజవరాతు
నందుఁ జొరలేవు కామాదులందు నొకటి.

గీ. గర్వమైనవాఁడు గాలిచేఁ గూలిన
మోఁడుమాను మాడ్కిఁ గూలిపోవు.
గర్వగానివాఁడు కడుఁ జలియింపని
బండరాతిరీతి నుండు నెపుడు.

గీ. మంచివాఁ డనిపించుకో నెంచితేని
మది దురాలోచనలు మాను, మంచి కెపుడు
ప్రోలుమాలినఁ దోఁచును బాపబుద్ధి,
యదియ దుఃఖప్రదము, మంచి నెదవు సుఖము.

గీ. ఈప్రపంచము నశియించు, నెపుడొ మనముఁ
జత్తు, మున్నంతనైన దంతెత్తు రుజలు,
మరణమున జీవితంబు సమాప్తమొందుఁ
గాన నిహపరములమేలు గనమెలంగు.

గీ. ధనికునకు దానగుణ మిసుంతయునుగల్గ,
దత్యుదారునకుం దృణ మైననుండ,
దాయువు దురాత్మునకుఁగడు నబ్బ, సద్గు
ణాఢ్యునకు మూఁడునాయు వేమబ్బురంబు.

గీ. ఆశవిడనాడు కంటె సౌఖ్యంబు లేదు
కలిత లోభంబుకంటె దుఃఖంబు లేదు
నరుల కుపకృతికంటెఁ బుణ్యాంబు లేదు
పరుల కపకృతికంటెఁ బాపంబు లేదు.

క. ఏవానివలనఁ బెక్కురు
జీవింతురొ ధరణి వానిజీవనమే స
జ్జీవన ; ముదరంభరు లిఁక
జీవన్మృతు లగుదు రెంతజీవించినను౯.

క. నీకాలికి ముల్లు సోఁకిన
నేకరణి న్నొప్పిగల్గు నెల్లరకట్లే
కాకని యెవ్వరినొవ్వఁగ
రాకుండఁ జరింపఁదగు ధరాస్థలిలోన౯.

క. కులమున్ శీలము విద్యయు
ఫలియింపవు, పూర్వజన్మపరిచిత పుణ్యాం
బులు కాలంబున వృక్షం
బులు ఫలియించిన ప్రకారమున ఫలియించు౯.

క. తమకున్నదానిలోఁ గొం
చెము దీనుల కనదలకు విశిష్టులకుం దా
నము సేయవలయు నటుసే
యమిఁ బరభాగ్యోపజీవు లగుదురుసుమ్మీ.

గీ. సత్యము ప్రియంబు పలుకుము, సత్యమైన
నప్రియము పల్కకుము, ప్రియమైనదైనఁ

బలుకకు మసత్యమును, ధర్మపద్ధతియిది
పలుకుపట్లను జాగ్రత్త వలయుఁగాదె ?

గీ. కనుఁగొనంగ గృహచ్ఛిద్రమును ధనంబు
మంత్రి మూషధ మాయువు మైథునంబు
ధర్మ మవమానముం బాపకర్మ మనెడు
తొమ్మిదియు గోప్యములు ప్రియత్నమ్ముచేత.

గీ. ఎట్టికులమునఁ బుట్టిన, నెంతరూప
వంతుఁడైనను, ధనమెంత బడసియున్న,
విద్యయొక్కింత లేకున్న వెలయలేఁడు
పరుఁడు, నిగంధకుసుమంబుకరణి ధరణి.

గీ. ఎంతగడియించినన్ ధనమింట నుండు
నెందఱో బంధులుండిన నేమి నుదరి
భూమివన్కనె చనుదెంచి పోవుచుందు
పాప పుణ్యంబులను రెండె వచ్చునెంట.

క. దాతృత్వము శౌర్యము సం
గీతమ్ము కవిత్వము నివి కేవలసహజ
స్థితములుగాని నేరుపు
చేతన్నమకూర నెట్టి శిష్టులకైనన్.

క. ఆయమునకు వ్యయమధికము
సెయుఁగరా, దట్లుసేయఁ జేట్లుపడు, నృధుం
డై యున్నప్పటి కాధన
మాయుష్యము ...దా... నెవ్వరికిన్.

గీ. చౌర్యమొనరించుకన్న భైక్షంబు మేలు,
నలి నసత్యముకన్న మౌనంబు మేలు,
సత్ప్రవర్తన విడుకన్నఁ జావుమేలు,
జారుఁడవుకన్న షండత చాలమేలు.

క. దుష్టస్నేహంబును విడి
శిష్టస్నేహంబు నెప్పుడు సేసినమనుజుం
డిష్టార్థంబు లఁగైకొని
కష్టంబుల పాలుగాక కడుసుఖియించున్.



